# ఆర్యకథాలహరి

## మొదటిభాగము

గ్రంథకర్త,

టి. వి. నరసింగరావు, బి. ఏ., యల్. టి.,

డిప్యూటి ఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్సు.



పబ్లిషర్సు:

రామా అండ్ కో., తర్లపాడు.

 (వెల 0-2-0

సూక్ష్మములో మోక్షము నిచ్చునదేది?

మూడు భాగములు

# భగవన్నుతి

ప్రతిభాగము వెల 0-2-0

భక్తియోగము అన్నియోగములలో శ్రేష్ఠమైనది. సులభసాధ్యమైనది. యోగిపుంగవులు, తపోధనులు, భక్తాగ్రేసరులు, పండితులు, పామరులు, కేవలము భగవన్నామగుణ సంకీర్తనములచేతను తమజన్మములను తరింపజేసికొనియున్నారు. ఇతరుల తరింపజేసిరి.

భగవత్సాన్నిధ్యమును గల్పించుకొని, భక్త్యావేశముచే మహాభక్తులుచేసిన స్తోత్రాదికములు పలుదేవతలనుగూర్చినవి అనేకయుద్గ్రంథములయందు ఒప్పారుచున్నవి. ఆయా గ్రంథములనన్నింటిని శోధించి, రత్నములవంటి గీతములను సేకరించి భగవన్నుతి యను చిన్ని పుస్తకమునందు సంగ్రహించినాము.

భగవన్నుతి సంస్కృతఘట్టము, తెలుగుఘట్టముగా ప్రతిపుస్తకము విభజింపబడినది. మొదటిఘట్టమునందు సంస్కృతకావ్యములలోని శ్లోకరాజములను, రెండవఘట్టమునందు ఆంధ్రకావ్యములలోని పద్యరాజములను రత్నములవలె ఏరినిందు కూర్చియున్నాము.

భగవన్నుతియందలి స్తుతులు చదువువారికి, వినువారికి, చిత్తశాంతిని, మానసికానందమును ఒనగూర్చి మోక్షప్రాప్తి గలిగించును.

వలయువారు:—రామా అండ్ కో.,
తర్లపాడు, (నెల్లూరుజిల్లా.)

# ఆర్యకథాలహార

## మొదటిభాగము

---

గ్రంథకర్త


టి. ఐ. నరసింగరావు, బి. ఏ., యల్. టి.,

డిప్యూటీ ఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్సు.





పబ్లిషర్సు:

రామా అండ్ కో., తర్లపాడు.

1933

రామకృష్ణ ప్రింటింగువర్క్సు, తెనాలి.




(వెల 0-2-0

# విషయసూచిక.







# ఆర్యకథాలహరి



## మొదటిభా

---

## 1 శ్రీరాముఁడు

పూర్వము దశరథుఁడను రాజు కలఁడు. అతఁడు అయోధ్యను బాలించు చుండెను. ఆరాజునకు కౌసల్య సుమిత్ర కైకేయి అను ముగ్గురు భార్యలు ఉండిరి. వారిలో కౌసల్యకు రాముఁడును, సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులును కైకేయికి భరతుఁడుననునలుగురు కుమారులుపుట్టిరి.

దశరథుని నలువురు కొడుకులును వసిష్ఠుని కడ సమస్త విద్యలు నేర్చికొనిరి. వారిలో పెద్దవాడగు రాముడు తండ్రి యందు మిగుల భక్తిగలవాడు. గుణ వంతుడు పెరిగి పెద్దవాడు అయిన తరువాత జనకమహారాజు కూతురగు సీతను పెండ్లాడెను. సీత చాల అంద మైనది. ఒక కారణమున దశరథుడు రాముని పదునాలుగేండ్లు అడవికి పంప వలసి వచ్చెను. రాముడు తండ్రిమా టను మీఱక అట్లే అడవికి పయన మయ్యెను. అతనితో సీతకూడ వెళ్లెను. లక్ష్మణుడును వారిని వెంబడించెను. సీతారామలక్ష్మణులు దండకారణ్యము

నకు వెళ్లి పంచవటియందు నివసించు చుండిరి.

ఆ కాలమున రావణుఁడు అను ఒక రాక్షసరాజు లంకను పాలించుచుండెను. అతఁడు దుర్మార్గుఁడు. రావణుఁడు ఒక నాఁడు మాయావేషమున వచ్చి రామ లక్ష్మణులు ఇంటిలో లేనిసమయమున సీతను అపహరించుకొని పోయెను.

రామలక్ష్మణులు సీతను గానక విల పించిరి. అడవి అంతయు వెదకిరి. అడ విలో వారికి వానరులు తోడైరి. వానరు లకు సుగ్రీవుఁడు రాజు. అతఁడు హను మంతుఁడు మొదలగువారిని నలుదిక్కు లకు పంపి సీతను వెదకించెను. సీత

లంకలో ఉన్నట్లు వారు తెలిసికొనిరి. వానరులు సముద్రమునకు వారధి గట్టిరి. రాముఁడు వానర సైన్యములతో సముద్రమును దాటి లంకలో ప్రవేశించెను.

అప్పుడు వానరులకును రాక్షసులకును లంకలో గొప్ప యుద్ధము జరిగెను. ఆ యుద్ధములో దుష్టులగు రాక్షసులు అందఱును చచ్చిరి. రాముఁడు గెలిచెను. చెడ్డవార లగు రాక్షసులు చచ్చినందులకు దేవతలు సంతోషించిరి. వారు పైనుండి పూలవాన గురిపించిరి. అప్పటికి పదునాలుగేండ్లు గడచెను. రాముఁడు సీతను దీసికొని మఱల అయోధ్యకు వచ్చెను. పౌరులు సంతోషముతో

పట్టాభిషేకముచేసి రాముని రాజుగా చేసిరి. రాముడు ప్రజలను తన బిడ్డల వలె చూచుచు చాలకాలము చక్కగా రాజ్యమును పాలించెను.

రాముని కథను తెలుపు గ్రంథమునకు "రామాయణము" అని పేరు. దానిని వాల్మీకి అను ఒకముని వ్రాసెను. రాముడు మహావిష్ణువుయొక్క అంశమున బుట్టినవాడు. కనుకనే హిందువులు ఆయనను దేవుడు అని పూజింతురు.

తండ్రిమాట మీఱరాదు.



## 2 విఘ్నేశ్వరుడు

పార్వతి శివునిభార్య. ఆమె ఒక నాఁడు నలుగుపిండితోఁ బిల్లవానివలె ఒక బొమ్మను చేసి దానికిఁ బ్రాణము పోసెను. ఆ బాలుని వాకిలి యొద్దఁ గావలిపెట్టి "లోనికి ఎవ్వరిని రానీయవలదు" అని చెప్పెను. ఆమె లోపల తల యంటుకొను చుండెను.

అంతలో శివుఁడు యుద్ధములో రాక్షసులఁ గెలిచి ఆ సంగతి భార్యతోఁ జెప్పుటకు తొందరగా ఇంటికి వచ్చెను. గుమ్మములో ఉన్న కుఱ్ఱవాఁడు శివుని లోనికి పోనీయలేదు. అందువలన ఆయనకు కోపము వచ్చెను. వెంటనే తన శూల

ముతో ఆ బాలుని పొడిచి చంపి లోనికి వెళ్లెను.

పార్వతి తన ముద్దుల బిడ్డను శివుడు చంపినాడని తెలిసి మిగుల దుఃఖించెను. "నా కుమారుని బ్రతికింపుము. లేని యెడల లోకములను నాశము చేయుదును" అని పార్వతి పలికెను. శివుడు తన భటులను పిలిచి "ఉత్తర దిక్కుగ తలపెట్టి పండుకొనిన వాని శిరము నటికి తెండు." అని పంపెను. ఒకచోట ఒక ఏనుగు ఉత్తరపువైపు తల ఉంచి పండుకొని ఉండెను. శివునిభటులు ఆ ఏనుగు తలను నటికి తెచ్చిరి.

శివుఁడు ఆ తలను ఆబాలుని మొండెమునకు అంటించి బ్రతికించెను. అందఱును సంతసించిరి. ఆబాలుఁడే విఘ్నేశ్వరుఁడు. భాద్రపద శుద్ధ చవితి ఆతఁడు పుట్టిన దినము. ఆనాఁడు దేశము అంతట ఆయనకుపూజ జరుగును. ఆయనకు "గజాస్యుఁడు" అని మఱియొక పేరు కలదు. "గజాస్యుఁడు" అనఁగా ఏనుఁగు ముఖము కలవాఁడు అని అర్థము.

విఘ్నేశ్వరుని ముందుగా పూజింపక ఏపనిని చేయరాదు.



## 3 ఇల్వలుఁడు

మణిమతి అను పట్టణములో విప్రజిత్తి అను ఒకరాక్షసుఁడు కలఁడు. అతని భార్య పేరు సింహిక. ఆదంపతులకు వాతాపి ఇల్వలుఁడు అను ఇద్దఱు పుత్రులు గలరు.

ఇల్వలుఁడు ఒకదినమున ఒకబ్రాహ్మణునిఁ జూచి "నాకు సమస్త కోరికలను ఇచ్చు మంత్రమును ఉపదేశింపుఁడు" అని అడిగెను. ఆబ్రాహ్మణుఁడు అందులకు సమ్మతింపలేదు. అందులకు ఇల్వలునికి బ్రాహ్మణులమీఁద కోపము వచ్చెను.

అంతటనుండి వాతాపి ఇల్వలులు బ్రాహ్మణులను అందఱిని చంపుటకు

ప్రారంభించిరి. వారు బ్రాహ్మణులను భోజనమునకు పిలుచుచుందురు. వాతాపి కామరూపి. అనఁగా అతఁడు ఏరూపమును పొందవలెను అంటే ఆరూపమును పొందఁగలఁడు.

కనుక ఇల్వలుఁడు వాతాపిని మేఁకను చేసి దాని మాంసమువండి బ్రాహ్మణులకుఁ బెట్టుచుండును. వారు భోజనము చేసిన తరువాత ఇల్వలుఁడు "వాతాపీ రమ్ము." అని తన సోదరుని పిలుచును. వెంటనే వాతాపి వారి పొట్ట చీల్చుకొని వచ్చుచుండును.

ఈ విధముగా బ్రాహ్మణులు చనిపోవుట చూచి కొందఱు అగస్త్యునిదగ్గఱకు

వెళ్ళి ఆసంగతి చెప్పి మొఱపెట్టుకొనిరి. అగస్త్యుఁడు బ్రాహ్మణులను కాపాడదలఁచి ఇల్వలుని కడకు వచ్చెను. ఇల్వలుఁడు ఎప్పటి అట్లు వాతాపిని మేఁకను చేసి వండి ఆయనకు భోజనము పెట్టెను. అగస్త్యుఁడు భోజనముచేసిన పిమ్మట పొట్ట రాచికొనుచు "జీర్ణము జీర్ణము వాతాపి జీర్ణము." అనెను.

వెంటనే లోపలఉన్న రాక్షసుఁడు జీర్ణము అయ్యెను. ఇల్వలుఁడు "వాతాపీ రమ్ము." అని పిలిచెను. కాని వాతాపి రాలేదు. వాతాపి చనిపోయెను అని ఇల్వలుఁడు ఎఱిగి లోలోన దుఃఖించెను. అతఁడు పైకి ఏమియు ఎఱుగని వానివలె

నటించుచు అగస్త్యునకు కోరిన ధనమును కూడ ఇచ్చి పంపించెను.

ఇతరుల మోసము చేయువాడు ఎప్పటికైనను చెడిపోవును.



## 4 నీలాసుందరి

పూర్వము మిధిలానగరమున కుంభకుడను ఒక గొల్లవాఁడు ఉండెను. అతనికి ఆవులు ఎద్దులు మొదలగు పశువులు అనేకములు కలవు. కుంభకునికి నీల అను పేరుగల ఒక కూతురు కలదు. నీల చాల రూపసి. ఈడు వచ్చిన కన్య. తండ్రి ఆమెకు పెండ్లిచేయవలెను అని తలంచుచుండెను.

ఒకనాఁడు కుంభకుని ఇంటికి నార దుఁడు వచ్చెను. ఆయన శ్రీకృష్ణుని సౌందర్యమును గొప్పతనమును గుఱించి కుంభకుని ఎదుట పొగడుచుండెను. నీల ఆమాటలు విని "కృష్ణుని పెండ్లి చేసి కొనవలెను" అని కోరెను. నారదుఁడు అక్కఁడినుండి ద్వారకకు వెళ్లెను. కృష్ణు నితో నీలాసుందరి సంగతి అంతయు చెప్పెను. ఆమె మిగుల అందమైనది. అని పొగడెను. ఆపలుకులువిని కృష్ణుఁడు ఎటులైనను నీలాసుందరిని పెండ్లాడ వలెను. అని సమయము కొఱకు కాచి ఉండెను.

కుంభకుని ఇంటిలో పొగరుపట్టిన

ఏఁడు గిత్తలు కలవు. అవి ఒకదినమున చెలరేగి ఊరిమీఁదపడి మనుష్యులను పొడుచుచుండెను. పైరుపంటలను నాశము చేయుచుండెను. ఆసంగతి మిధిలా నగరమును పాలించు రాజు విని "గిత్తలను పట్టి కట్టివేయుము" అని కుంభకునికి ఆజ్ఞ ఇచ్చెను.

ఆ కోడెలను పట్టుటకు ఆ పట్టణములో ఎవరికిని సాధ్యము గాక పోయెను. అవి మాయకోడెలు. అప్పుడు కుంభకుఁడు "ఈగిత్తలను లొంగదీయు వానికి నాకూతురగు నీలను ఇచ్చి పెండ్లిచేయుదును." అని చాటింపుచేసెను. కృష్ణుఁడు ఆవార్తవిని వచ్చి ఆఁబోతులను పట్టి అవ

లీలగాఁ జంపెను. కుంభకుఁడు ఆయనకు నీలను ఇచ్చి వివాహము కావించెను.

గొప్పవారికి చేయరానిపని లేదు.

---

## 5 ఆరుణి

చాలకాలము క్రిందట ధౌమ్యుఁడను ఒకఋషి ఉండెను. ఆయన దగ్గఱ ఆరుణి చదువుకొనుచుండెను. వానికి విద్యయందు ఆశ ఎక్కువ. గురువునందు భక్తికూడ మిక్కుటము. ధౌమ్యుఁడు ఒకనాఁడు ఆరుణిని పిలిచి "నాపొలములో నీరు కట్టతెగి పోవుచున్నది. నీవు వెళ్ళి నీళ్ళు బయటికి పోకుండ కట్టవేసి

రమ్ము." అనెను.

ఆరుణి పొలమునకు పోయి చూచెను. అక్కడ ఒకమనుష్యుని పొడవున కట్టతెగి నీళ్లు పోవుచుండెను. అతడు నీటికి అడ్డముగా జాలతోను మంటితోను కట్టుకట్టెను. కాని అది నిలువలేదు. అప్పుడు ఆరుణి ఏమియు తోపక ఆగండికి అడ్డముగా తానే పండుకొనెను. నీరు పోవుట ఆగెను.

ఆరుణికి చలిబాధ మిక్కుటముగా ఉండెను. జలగలు మొదలగునవి శరీరమును పట్టి పీకుచుండెను. అయినను అందుండి లేచిన "గురువు ఆజ్ఞచేసిన వాడను కాను." అని అతడు లేవలేదు.

"ఎంతసేపటికిని శిష్యుఁడు ఇంటికి రాలేదు. ప్రొద్దు క్రుంకెను. చీకటి పడెను." అని ధౌమ్యుఁడు దీపము పట్టుకొని పొలముదగ్గఱకు వెళ్లెను. ఆరుణి కనుపడలేదు. "ఆరుణి ఆరుణి" అని బిగ్గరగా పిలిచెను. ఆరుణి అక్కడనే ఉండి "ఆ" అనెను. గురువు వెళ్లి చూచి లేవదీసి వాని భక్తికి మెచ్చుకొనెను. వెంటనే ఇంటికి తీసికొని వెళ్లి స్నానము చేయించి అన్నము పెట్టించెను. కప్పుకొనుటకు ఉదికిన గుడ్డలను ఇప్పించెను. తరువాత ధౌమ్యుఁడు అతనికి ప్రేమతో అన్నివిద్యలను చక్కఁగా నేర్పెను. (గురువు ఆజ్ఞ చేయవలెను.)

## 6 అనసూయ

అనసూయ అత్రిమహాముని భార్య. ఆమె మహాపతివ్రత. ఆమె పతిభక్తిని పరీక్షింపవలయును అని బ్రహ్మ విష్ణువు మహేశ్వరుడు బ్రాహ్మణవేషములు వేసి కొని అతిథులవలె ఆమె ఇంటికి పోయిరి. ఆమె వారిని ఆదరించి ఆకులో అన్నము పెట్టుసమయములో వారు ముగ్గురు "నీవు దిసమొలతో వడ్డించిన కాని మేము భోజనము చేయము" అనిరి. ఆమె జ్ఞానవంతురాలు. కనుక వారు ఎవరో తెలిసికొని కానిండు అని మంత్రించిన అక్షతలు నీళ్లు వారిపై చల్లెను.

అంతట త్రిమూర్తులు వెంటనే కావు

కావుమని ఏడ్చుచు చంటిబిడ్డలు అయి
రి. వారికి తానే పాలుఇచ్చి కాపాడు
చుండెను. ఆ సమాచారము తెలిసి వారి
భార్యలు సరస్వతి లక్ష్మి పార్వతి ముగ్గు
రును అనసూయాదేవి దగ్గఱకు వచ్చి
తమభర్తలను తమకు ఇయ్యవలసినది
అని వేడుకొనిరి.

అప్పుడు అనసూయ వారిని యథా
ప్రకారముగ చేసెను. అంతట త్రిమూ
ర్తులు ఆమెకు ప్రత్యక్షమై "నీకు కావ
లసిన వరమును అడుగుము" అనిరి.
"మీరు ముగ్గురును నాకడుపున పుత్రు
లుగ పుట్టుడు" అని అనసూయ వారిని
కోరెను. "సరే" అని బ్రహ్మ చంద్రుం

డుగను విష్ణువు దత్తాత్రేయుఁడుగను మహేశ్వరుఁడు దుర్వాసుఁడుగను అనసూయ కడుపున పుట్టిరి.

పతివ్రతలకు అపకారము చేయ తలచిన ఎడల మానహాని తప్పక కలుగును.



## 7 న ర కా సు రుఁ డు

ఇతఁడు ఒక రాక్షసుఁడు. బలము కలవాఁడు. తనకు బలము ఉన్నది అని మునులను దేవతలను ఎప్పుడు బాధించుచుండును. ఇతఁడు పెట్టు ఇడుములను పడలేక ఋషులు వెళ్లి శ్రీకృష్ణునితో చెప్పుకొనిరి.

నరకుఁడు ఒకదినమున స్వర్గము మీఁదికి దండెత్తిపోయెను. స్వర్గమునకు రాజు ఇంద్రుఁడు. అతఁడు నరకుని జూచి భయపడెను. నరకుఁడు ఇంద్రుని భార్యను శచీదేవిని చెఱపట్టెను. ఇంద్రుఁడును మూఁడుకోట్ల దేవతలును పాఱిపోయి అడవుల పాలయిరి.

ఈసంగతి కృష్ణునితో చెప్పుటకు ఇంద్రుఁడు మాణిభద్రుని పంపెను. మాణిభద్రుఁడు తిన్నగా ద్వారకకు వెళ్లి దేవతలకు కలిగిన ఇక్కట్లు శ్రీకృష్ణునికి ఎఱిగించెను. కృష్ణుఁడు నరకుని చంపుటకు బయలుదేఱెను. ఆయనతో సత్యభామకూడ వెళ్లెను. కృష్ణుని చూచి

నరకాసురుఁడు ఎగతాళిచేసెను. కృష్ణుఁడు వానికి నీతిని బోధించెను. నరకుఁడు మూర్ఖుఁడు. కనుక వాఁడు కృష్ణుని మాటలను వినలేదు.

అంతట కృష్ణునికి నరకాసురునికి గొప్ప యుద్ధము జరిగెను. సత్యభామ నరకుని మూర్ఛ పడునట్లు బాణముతో కొట్టెను. కొంతసేపటికి అతఁడు మూర్ఛ తెలిసి మఱల కృష్ణుని మీఁదికి వచ్చెను. కృష్ణుఁడు తన చక్రముచే నరకాసురుని తలఁ ద్రుంచెను. అప్పటినుండి దేవతలును మునులును సుఖపడిరి. నరకాసురుఁడు చచ్చిన దినమే మనము ప్రతి సంవత్సరము చేయు దీపావళి పండుగ

దినము.

బలవంతుడను అని గర్వపడరాదు.

---

## 8 శిబిచక్రవర్తి

పూర్వము శిబి అను ఒకరాజు కలఁడు. అతఁడు సుశీనర దేశమును పాలించుచుండెను. ఆతని తండ్రిపేరు ఉశీనరుఁడు. తల్లిపేరు మాధవి. భయపడిన వారిని కాపాడుటలో శిబి చాల పేరు పొందెను.

ఒకసారి ఇంద్రుఁడును అగ్నిదేవుఁడును "శిబిచక్రవర్తిని పరీక్షింపవలెను." అనుకొనిరి. ఇంద్రుఁడు డేగ అయ్యెను. అగ్నిదేవుఁడు పావురము అయ్యెను. శిబి తోటలో కూర్చుండి ఉండఁగా డేఁగ

పావురమును తఱుముకొని వచ్చెను.

పావురము భయముతో శిబి దగ్గఱకు వచ్చి "నన్ను కాపాడుము." అనెను. శిబి "నీవు భయపడవద్దు. నిన్ను రక్షింతును." అని పలికెను. అంతలో డేఁగవచ్చి రాజును జూచి "ఆపావురము నాకు ఆహారము. దీనిని నీవు రక్షింపని యెడల నేను తినియుందును. నానోటి కడ తీసితివి. అది న్యాయముకాదు. కనుక విడిచిపెట్టుము. అట్లు విడువని యెడల ఆఁకటి బాధచే నాప్రాణములు పోవును. జీవహింస చేసిన పాపము నీకు ఎట్లయినను తప్పదు." అనెను.

రాజు నమ్మినవారిని చెఱుచువాఁడు కాఁడు. కనుక "ఈపావురమును నీకు ఈయను. నీవు తినుటకు దీని ఎత్తు ఇతర మాంసమును ఇత్తును." అని బదులు చెప్పెను. డేఁగ రాజుమాటలు విని "పావురము ఎత్తు మాంసము నీ శరీరము నుండి కోసి ఇమ్ము." అని అడిగెను. రాజు అందులకు "సరే" అనెను. అతఁడు త్రాసులో ఒకప్రక్క పావురమును ఉంచి రెండవప్రక్క తన తొడను కోసి పెట్టెను. ఎంతపెట్టినను పావురమునకు సరిగా తూఁగలేదు. అప్పుడు శిబి డేఁగతో "నన్నే తినుము." అని చెప్పెను.

ఆమాటలు విని డేఁగ ఆశ్చర్యపడి

వెంటనే ఇంద్రుఁడుగా మాఱెను. పావు రము అగ్ని దేవుఁడుగా మాఱెను. అందఱు ను రాజు బుద్ధికి సంతోషించిరి. దేవతలు శిబిచక్రవర్తిని జూచి మెచ్చుకొని ఆయ నకు పుణ్యలోకమును ఇచ్చిరి.

భయపడిన వారిని కాపాడవలెను.

---

## 9 క చుఁ డు.

రాక్షసులకు ఒక గురువు కలఁడు. ఆయన పేరు శుక్రాచార్యుఁడు. ఆయనకు చచ్చిన వారిని బ్రతికించు ఒక మంత్రము తెలియును. దానిని నేర్చుకొనవలయును అని కచుఁడు అనువాఁడు దేవలోకమునుం డి వచ్చి ఆయనకు శిష్యుఁడుగా ఉండెను.

ఈసంగతి రాక్షసులకు తెలిసి వారు కచుని చంపిరి. శుక్రాచార్యుఁడు మఱల కచుని బ్రతికించెను. వారు ఎన్నిమారులు చంపినను ఆయన బ్రతికించుచునే ఉండెను. శుక్రునికి సారాయి త్రాఁగు చెడ్డ అలవాటు కలదు. ఒకమాటు రాక్షసులు కచుని చంపి కాల్చివేసి వాని బూడిదను సారాయముతో కలిపి గురువునకు ఇచ్చిరి. శుక్రుఁడు అది తెలియక దానిని త్రాఁగెను.

తరువాత ఎక్కడ వెదకినను కచుఁడు కనుపడలేదు. శుక్రాచార్యుఁడు దివ్యదృష్టితో చూచి "కచుఁడు తన కడుపులో ఉన్నాడు." అని తెలిసికొనెను.

కడుపులోనే కచుని బ్రతికించెను. వాఁడు బ్రతికి "అయ్యా నేను ఇక్కడ ఉన్నాను. బయటికి వచ్చుట ఎట్లు?" అని అడిగెను.

అప్పుడు శుక్రుఁడు కచునకు "చచ్చిన వారిని బ్రతికించు మంత్రము" నేర్పి ఇట్లు పలికెను. "ఓ కచుఁడా నా పొట్ట చీల్చుకొని నీవు బయటికి రమ్ము. తరువాత నన్ను బ్రతికింపుము." కచుఁడు అట్టులే చేసెను. శుక్రాచార్యుఁడు సారాయము త్రాగుట వలని దోషము తెలిసికొని "ఇకమీదట దానిని ఎవరును త్రాఁగకూడదు." అని శాపము పెట్టెను.

కల్లు సారాయముల త్రాఁగరాదు.

## 10 బసవన్న

మండెంగి మాదిరాజునకు మాదమాంబ అను భార్యకలదు. ఆమె చాల కాలము తనకు బిడ్డలు లేరని దుఃఖించుచుండెను. ఒకనాఁడు ఆమె నందికేశ్వరుని గూర్చి ప్రార్థించెను. ఆ దేవుని దయవలన మాదమాంబకు గర్భము అయ్యెను. ఆమె మూఁడుసంవత్సరములు కడుపుతో ఉండి చివరకు ఒక మగ బిడ్డను కనెను. ఆ శిశువునకు తలిదండ్రులు బసవన్న అని పేరు పెట్టిరి.

బసవన్న పెరిగి పెద్దవాఁడయిన తరువాత బిజ్జలుఁడను ఒకరాజు దగ్గఱ మంత్రిగా ఉండెను. అతఁడు దేవుని

మీఁద మిగుల భక్తి గలవాఁడు. ఇతరుల సొమ్మును ఎన్నఁడును కోరడు. రాజు బసవన్న మంచిగుణములను చూచి మెచ్చుకొనుచుండును.

ఒక దినమున ఒకభక్తుఁడు వచ్చి బసవన్నను చూచి "మీరు గొప్పవారు" అని వచ్చితిని. రాజుగారి ఖజానాలో ఉన్న ధనము సర్వమును నాకు ఇచ్చివేయుడు." అని ప్రార్థించెను. బసవన్న సందేహింపక అట్టులే ఇచ్చివేసెను.

ఇతర మంత్రులు ఆసంగతి రాజుతో చెప్పిరి. రాజు ఆయనను పిలిచి కోపపడెను. "నీవు ఇతరుల ధనమును కోరవు కదా! మా ధనమును ఏల ఇచ్చితివి.?"

అని అడిగెను. అందులకు బసవన్న "మీ ధనము నాకు ఎందులకు? మీ ఖజానాలో చూచుకొనుఁడు." అని బదులు చెప్పెను. రాజు ఖజానాలో చూడఁగా ధనమంతయు ఉండెను. అందఱు ఆశ్చర్యపడిరి. "బసవన్న గొప్ప భక్తుఁడు. కనుక దేవుఁడే ఆ ధనమును మఱల అక్కడ పెట్టి ఆయనకు మాటరాకుండ చేసెను." అని తలంచిరి.

భక్తులను దేవుఁడు కనిపెట్టుచుండును.



## 11 నహుషుఁడు

పురూరవ చక్రవర్తికి ఊర్వశియందు నహుషుఁడను కుమారుఁడు కలిగెను. అతఁడు ప్రియంవదను వివాహామాడెను. ఆమెకు ఐదుగురు కొడుకులు పుట్టిరి. నహుషుఁడు అనేక యజ్ఞములు చేసెను. బ్రాహ్మణులకు గొప్ప దానములు ఒసగెను. అందువలన భూలోకమునే కాక ఒకప్పుడు దేవలోకమును సయితము నహుషుఁడు పాలించెను.

నహుషుఁడు భూలోకములో రాజ్యము చేయుకాలమున ఒకమాటు బోయలు కొందఱు చేపలకై గంగా నదిలో

వలవేసిరి. ఆ నదిలో తపస్సు చేసికొను చుండిన చ్యవనుఁడను ముని వారి వలలో చిక్కుపడి వచ్చెను. ఆయనను చూచి భయపడి మ్రొక్కి ఆ వృత్తాంతమును బోయలు తమరాజగు నహుషునకు ఎఱింగించిరి.

ఆసంగతి విని నహుషుఁడు మంత్రులతో కలిసివెళ్లి చ్యవనునికి నమస్కరించి బోయలు చేసిన తప్పు క్షమింపుడని వేడెను. తన శరీరమునకు సరియైన విలువ వారికిమ్మని చ్యవనుఁడు రాజును అడిగెను. అందులకు నహుషుఁడు వేయి మాడలు ఇచ్చెదననెను. అది తగిన విలువ కాదని ముని చెప్పగ మఱల

కోటిమాడలు ఇత్తుననెను. కానిచో సగము రాజ్యమునైన ఇత్తుననియెను. తుదకు తనరాజ్యము సర్వము ఇచ్చెదననెను. అదియు తనకు సరియైన విలువ కాదని చ్యవనుఁడు పలికెను.

అప్పుడు ఏమియు తోఁచక నహుషుఁడు చింతించుచుండఁగ అక్కడకు గవిజాతుఁడను మఱియొక ముని వచ్చెను. చ్యవసునికి సమానమైనది గోవు తప్ప ఇంకొకటి కాదని ఆయన చెప్పెను. ఆమాట విని నహుషుఁడు చ్యవసునితో గోవును ఇచ్చెదనని పలికెను. చ్యవనుఁడు దానికి తృప్తిపడెను.

కాబట్టి గోవు బ్రాహ్మణునితో సమానము.

---

## 12 ఆషాఢభూతి

దేవశర్మయను సన్యాసి ఒకడుండెను. వాఁడు కడు లుబ్ధుఁడు. వానికి ఎవ్వరు ఏమి ఇచ్చినను దానిని విక్రయించి ఆసొమ్మును ఒక బొంతలో పోసి ఆబొంతను సదా తనయొద్దనే ఉంచుకొనువాఁడు.

దేవశర్మ దగ్గఱ అంత ధనము ఉన్నట్లు ఆషాఢభూతి అను వానికి మాత్రము తెలియును. వాఁడు ఎట్లయినను ఆసొమ్మును దొంగిలించుటకు ప్రయత్నించెను. కాని ఆపని వీలుకాలేదు. తుదకు ఏదైన ఉపాయముచే లాగుకొనవలయునని ఎంచి, ఒకనాఁడు దేవశర్మను

సమీపించి "అయ్యా! నన్ను ఉద్ధరించు భారము మీదే. నేను సంసార బాధలకు రోసి దానిని విడిచి వచ్చితిని. శరీర సౌఖ్యములు ధనము శాశ్వతములు కావు. వానితో నాకు పనిలేదు. నన్ను మీ శిష్యుఁడుగా గైకొనుఁడు. మీకు సేవ చేయుచుందును". అని పలికెను.

సన్యాసి ఆమాటలు నమ్మి వాఁడు శిష్యుఁడగుటకు అంగీకరించెను. కాని బొంతమాత్రము వానికిచ్చుటలేదు. ఆ షాఢభూతి ఇతరుల చీపురు ముల్లయినను తన బట్టలకంటుకొనిన ఎడల దేవశర్మ చూచుచుండఁగ దానిని తీసి ఇచ్చివేయు వాఁడు.

అట్లు నటించుటచే దేవశర్మకు ఆషాఢభూతియందు నమ్మకము కుదిరెను. ఒకసారి వారిద్దఱును ప్రయాణము చేయుచుండఁగా దారిలో దేవశర్మ బొంతను పట్టుకొనుమని శిష్యుని చేతికిచ్చెను. ఆషాఢభూతి దానిని పుచ్చుకొని వెంటనే పరుగెత్తుకొని పోయెను.

నిజస్థితి తెలియనిది ఎవరిని నమ్మరాదు.

సంపూర్ణము.

# సోదరుల కొక మనవి.

అయ్యా! మావద్ద అన్ని కంపెనీల, అన్ని రకముల యింగ్లీషు, తెలుగు పుస్తకములు, నాటకములు, నవలలు, కావ్యగ్రంథములు, వైద్యగ్రంథములు, ప్రబంధములు, యక్షగానములు, అన్నిరకముల స్కూలు పాటములున్నూ, బజారు పుస్తకములున్నూ, స్టేషనరీ సామానులున్నూ దొరకగలవు. స్కూలురిజిష్టర్లు, ఎక్కాలబుక్కులు, గణితబోధినీలు, క్రొత్త సంవత్సరపు పంచాంగము కేలండర్లు వర్తకులకు చాలతక్కువ ధరకు విక్రయించెదము.

ఇవియుగాక మావద్ద స్వదేశీ రాతివలకలు గలవు. నిపుణులైన పనివాండ్రచే తయారుచేయబడి చూచుటకు రమ్యములై కన్పట్టును. ధరలు అతిసరసము. ఒకమారార్డరిచ్చిన మాసంగతి మీకే తెలియగలదు. వలయువారు చిరునామాలు స్పష్టముగా వ్రాయవలయును. రు 5—0—0 మించిన ఆర్డర్లను అడ్వాన్సుతో పంప ప్రార్థితులు.

వలయువారు:—రామా అండ్ కో.,

బుక్ సెల్లర్సు & ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,

తర్లపాడు, (నెల్లూరు జిల్లా.)

